

# అమ్మకి జుట్టు

కెల్లీ టింక్‌హామ్, బొమ్మలు: ఎమీ జూన్ బేట్స్

తెలుగు: కె. సురేష్

# అమ్మకి జుట్టు

కెల్లీ టింక్‌హామ్, బొమ్మలు: ఎమీ జున్ బేట్స్

తెలుగు: కె. సురేష్

DIAL BOOKS FOR YOUNG READERS



చాలా మందికి తమ జుట్టు విలువ తెలియదు. కానీ నాకు తెలుసు. మా కుటుంబంలో జుట్టుకి, ప్రత్యేకించి అక్టోబరు నెలలో కుటుంబం మొత్తం ఫొటో దిగేటప్పుడు ఎంతో ప్రాముఖ్యత ఉంది.  నెత్తి మీద ఎక్కువ ఉండి, పక్కల, మెడ మీద కురచగా అయ్యే 'అయ్యే' జుట్టు స్టైల్ అంటే నాకు ఇష్టం. మా అక్క యొలాందాకి జడలకు పూసలు అల్లుకోవటం ఇష్టం. తమ్ముడు స్టీవ్‌కి, నాన్నకి సహజంగా, చిన్నగా ఉండే జుట్టు అంటే ఇష్టం. అమ్మకి జడలు అంటే ఇష్టం. అయితే ఫొటో తీసే రోజున ఆ జడలను నెత్తి మీద కిరీటం అనిపించేలా అల్లటం అంటే ఇంకా ఇష్టం.

కానీ ఆగస్టులో అంతా మారిపోయింది. అమ్మకి క్యాన్సర్ వచ్చింది.





క్యాన్సర్ ఒక రోగం అని అమ్మ చెప్పింది. ఆమె శరీరంలో ఒక చిన్న భాగంగా చాలా వేగంగా పెరిగి, చాలా పెద్దది అవుతోంది. దానివల్ల ఆమెకి అవసరమైన ఇతర అవయవాలకి చోటు లేకుండా పోతోంది. అమ్మ మాటలు వింటే తోటలో బంతి, చామంతి వంటి అందమైన పూలకి చోటు లేకుండా కలుపు మొక్కలు పెరిగిపోవటం లాగా అనిపించింది నాకు.

అమ్మ మందులతో చికిత్స తీసుకుంటోంది, దీనిని కీమోథెరపీ అంటారు. దాని వల్ల క్యాన్సర్ తగ్గుతుంది, కానీ నీరసంగా ఉండటం, అలసిపోవటం వంటి ఇతర ప్రభావాలు కూడా ఉంటాయి. అంతేకాదు, ఆమె అందమైన జుట్టు ఊడిపోతుంది.

సెప్టెంబరు నెల అంతా అమ్మ జుట్టు రాలిపోతూ పలచబడుతూ ఉంది. ''సోఫీ జుట్టు కంటే నా జుట్టు వేగంగా రాలుతోందని నాకు అనిపిస్తోంది,'' అని ఒక రోజు ఉదయం అమ్మ అంది.

సోఫీ అంటే మా పిల్లి. ''అమ్మా, నీ జుట్టు అంతా రాలిపోయినా నీకు ఇంకా ఎక్కువ జుట్టు నేను ఇస్తాను,'' అమ్మకి తన జడలంటే ఇష్టం అని తెలిసిన నేను చెప్పాను.

దువ్వెన నా వైపు చూపిస్తూ, ''నాకు జుట్టు ఎలా తెస్తావు, మార్కస్?'' అమ్మ అడిగింది.

''ఎలా అంటే చెప్పలేను. కానీ నీకు జట్టు మాత్రం తెస్తాను,'' అని చెప్పాను.

అక్టోబరు నెల వచ్చింది. అయితే నేను ఇచ్చిన మాట సంగతి మరిచిపోయాను. ఫొటో దిగే రోజు దగ్గరపడుతోంది. క్రాఫోర్డ్ పార్క్‌లో ఫొటో తియ్యటానికి నాన్న ఫొటోగ్రాఫర్ మిడ్జ్ లార్సన్‌కి చెప్పి ఉంచాడు. పండుతూ ఎరుపూ, నారింజ, పసుపు రంగులలో ఉండే మేపల్, బీచ్ చెట్ల ఆకులంటే అమ్మకి ఎంతో ఇష్టం. ''మనకు ఉండే చెట్లలో ఇవి ఎంతో అందంగా ఉంటాయి,'' అని అమ్మ ఎప్పుడూ అంటూ ఉంటుంది.

అయితే ఈ సంవత్సరం అమ్మ ఆ చెట్ల వంక చూడను కూడా చూడలేదు. దానిమ్మ పండులా ఎర్రగా ఉన్న మేపల్ చెట్టుని చూపిస్తే ఆమె ఎంతో అలసటగా "హూ!" అని మాత్రం అనగలిగింది. ఆపాటికి ఆమె నెత్తి మీద ఉన్న జుట్టు అంతా ఊడిపోయింది. ఆమె నవ్వినప్పుడు కూడా ఆమె కళ్లు విషాదంగా ఉండేవి. పోయిన సంవత్సరం నాకు మంచి స్నేహితుడైన బావ రచీ వర్జీనియాకి వెళ్లిపోయినప్పుడు కూడా నా కళ్లు అలాగే ఉండేవి.



ఫొటో దిగటానికి ఇంకా అయిదు రోజులే ఉన్నాయి. బట్టలు కొనటానికి ఇప్పటివరకు అమ్మ మమ్మల్ని తీసుకుని వెళ్లలేదు. దాంతో నాలో ఆందోళన ఇంకా పెరిగిపోయింది. అప్పుడు అక్కతో మాట్లాడదామని అనుకున్నాను. ఆమెకి పది సంవత్సరాలు. నాకన్నా రెండేళ్లు పెద్ద.

"అమ్మకి బాగా లేదు," అక్క చెప్పింది. "ఏమాత్రం బాగా లేదు."

అప్పుడు అమ్మకి నేను ఇచ్చిన మాట గుర్తుకు వచ్చింది. "జుట్టు ఉంటే అన్ని సమస్యలు పరిష్కారం అయిపోతాయి," అని అనకుండా ఉండలేకపోయాను.

"ఇది అంత చిన్న విషయం కాదు, మార్కస్. కొంతమందికి ఈ జబ్బు తగ్గదు," కళ్లు పెద్దవి చేస్తూ చెప్పింది అక్క.

"అమ్మకి తగ్గిపోతుంది," నేను అన్నాను. "ఆమె మందులు తీసుకుంటోంది, ఆమెకు నయం అయిపోతుంది."



సోమవారం రాత్రి అమ్మతో ఫొటోలు దిగే రోజు గురించి మాట్లాడాను. అప్పుడు అమ్మ కొంచెం నీరసంగా ఉంది. ఆమె కుర్చీలో కూర్చుని ఉంది. నాన్న రాత్రికి వంట చేస్తున్నాడు. అమ్మ ముఖం ఉబ్బి, పాలిపోయి ఉంది.

"ఆ రోజున ఫొటోలు తప్పకుండా దిగుదాం," అమ్మ చెప్పింది. "అయితే వాటిల్లో నేను ఉండను. ఇప్పుడు నాకు జుట్టు ఏమీ మిగల లేదు... ఫొటోలో జుట్టు లేకుండా నన్ను నేను ఊహించుకోవటం కూడా కష్టంగా ఉంది."

చదువుతున్న పుస్తకాన్ని పక్కన పెట్టి యొలాందా అమ్మ వైపుకి వంగింది. "నువ్వు లేకుండా ఫొటో ఎలా," ఆమె బతిమాలింది. "కావాలంటే తలకి రుమాలుతో పాగాలా చుట్టుకో. దాని కింద జుట్టు లేదని ఎవరికీ తెలియదు."

"నాది బోడి గుండని నాకు తెలుసు కదా," అమ్మ కళ్లు ఎటో చూస్తున్నాయి. "నన్ను అలా గుర్తు పెట్టుకోవటం నాకు ఇష్టం లేదు."

అమ్మ లేకుండా ఫొటో అన్న భావనే నాకు నచ్చలేదు. "నీకు తప్పకుండా జుట్టు తెస్తాను," అని చెప్పాను.

యొలాందా నమ్మలేనట్టు చూసింది. అమ్మ ఏమీ మాట్లాడలేదు. ఆమె నవ్వేసి, మళ్లీ మగతలోకి జారుకుంది.



అమ్మకి జుట్టు ఎలా తీసుకురావాలని మరుసటి రోజంతా ఆలోచిస్తూనే ఉన్నాను. బడి నుంచి తిరిగి వచ్చిన తరవాత బొమ్మలు కొనటానికి అమ్మ తీసుకుని వెళ్లింది. మేం బట్టల దుకాణం వైపు వెళుతుండగా దారిలో హాలోవీన్ దుకాణంలో రకరకాల బట్టలు, ముఖానికి తొడుగులు, విగ్గులు వంటివి కనిపించాయి.

‘‘చూడండి!’’ నేను అరిచాను. ‘‘జుట్టు. రకరకాల విగ్గులు.’’

యొలాందా, నేను చాలా విగ్గులు తీశాం. ‘‘వీటిల్లో ఏది బాగుందో పెట్టుకుని చూడు,’’ అమ్మతో అన్నాను.

‘‘నాకు వద్దు,’’ అంటూ అమ్మ తటపటాయించింది. యొలాందా కూడా బతిమాలటంతో ఆమె ఒప్పుకుంది. చుట్టూ ఒకసారి పరికించి చూసి, మోకాళ్ల మీద కూర్చుని అమ్మ తన టోపీ తీసేసింది. ఒక విగ్గు పెట్టుకోటానికి నేను సహాయపడ్డాను.

‘‘ఇది నాకు నప్పిందా?’’ అమ్మ అడిగింది.

‘‘బాగా ఎర్రగా ఉంది,’’ బొమ్మలకు ఉండే జుట్టు లాగా ఉన్న ఆ విగ్గు తీసేస్తూ నేను అన్నాను.

తరవాత యొలాందా అమ్మకి ఇంకొక విగ్గు తొడిగింది. దాని జుట్టు రంగు ఆమెకి నచ్చలేదు. ఒక విగ్గు చిన్నదయ్యింది, మరొకటి గుచ్చుకుంటోంది. ఒక సమయంలో అమ్మకి ఒక విగ్గు కొంచెం బాగుందనిపించింది, కానీ చివరికి అది కూడా నచ్చలేదు.

ఇంకొక విగ్గు పెట్టుకుని చూడమని నేను చెబుదామనుకున్నంతలో అమ్మ నా చేతిని తన చేతుల్లోకి తీసుకుని, "మార్కస్, నేను ఈ విగ్గులు పెట్టుకోలేను. అది పెట్టుకుంటే నేను నేనుగా అనిపించను. చారల పులికి మచ్చల చర్మం తొడిగినట్టు అనిపిస్తుంది. నేను చెబుతున్నది అర్థం చేసుకోగలుగుతావు కదా?"

నేను తల ఊపాను. అయితే, నాన్న నా షూ లేసులు కట్టినప్పుడు గట్టిగా అనిపించిన దానికంటే ఇంకా గట్టిగా నా లోపల గుండె మెలిపెట్టినట్టు అనిపించింది. అమ్మ పెట్టుకునే జుట్టు వెతకాలంటే అందుకు నేను ఎంతో ప్రత్యేకమైనది తీసుకుని రావాలని నాకు తెలుసు. చూస్తుండగానే రోజులు గడిచిపోయాయి. శుక్రవారం రానే వచ్చింది. ఫొటో దిగవలసింది మరుసటి రోజే. నా గుండె రాను రాను మరింత మెలిపడుతోంది. అమ్మ నిరంతరం అలసిపోయి కనపడుతోంది. నాకు నిద్ర కూడా పట్టటంలేదు. ఆ రాత్రంతా రెండు అద్భుతాల కోసం ప్రార్థన చేస్తూ గడిపేశాను – ఫొటోలు దిగటానికి అమ్మ కూడా రావాలి, ఆమె ఆరోగ్యం వేగంగా పుంజుకోవాలి.



మరునాడు ఉదయిస్తున్న సూర్యుడి కిరణాలకు చెట్ల ఆకులు ఎర్రని జ్వాలగా వెలుగుతున్నాయి. యొలాందాకి అమ్మ జడలు వేసింది. తమ్ముడి జుట్టుని, నా జుట్టుని నాన్న సవరదీశాడు. కానీ అమ్మకి జుట్టు తెచ్చే ఆశ నాకు ఎక్కడా కనపడటం లేదు.

నాస్తా చేసిన తరవాత నాన్న నన్ను మంగలి దుకాణం వద్ద దింపి శనివారం నాడు కొనాల్సిన సరుకులు కొనటానికి వెళ్లాడు. "నీ క్రాఫ్ మరీ కురచగా చెయ్యకుండా కొద్దిగా సరిజెయ్యమన్నాని దోర్ మామకి చెప్పు," అని నాకు చెప్పి ఆయన వెళ్లిపోయాడు.

ఆ సమయంలో దోర్ మామ ఇంకొక వ్యక్తికి జుట్టు కత్తిరిస్తున్నాడు. కచ్ కచ్ మంటు అతడి కత్తెర శబ్దం చేస్తూ జుట్టు కత్తిరిస్తోంది. దోర్ మామ కాళ్ల దగ్గర పోగుబడుతున్న జుట్టుని ఒకసారి చూశాను, మళ్లీ చూశాను. ఏం చెయ్యాలో ఆ క్షణంలో నాకు బోధపడింది.



ఆ వ్యక్తి క్రాఫ్ అయిన తరవాత కుర్చీలో కూర్చోమని దోర్ మామ నన్ను పిలిచాడు. “మీ అమ్మ ఆరోగ్యం ఎలా ఉంది?”

ఆ ప్రశ్నకి ఏం జవాబు చెప్పాలో నాకు తెలియలేదు. అందుకే, “కొంచెం మెరుగు గానే ఉంది,” అని చెప్పాను. నాన్న వచ్చే లోపు నా క్రాఫ్ పని పూర్తి చేయించుకోవాలని తొందరపడుతున్నాను.

“సరే,” అంటూ దోర్ మామ, “ఎప్పటిలాగే చెయ్యమన్నావా?” అని అడిగాడు.

“లేదు, మొత్తంగా గొరిగెయ్యి,” దోర్ మామ ఇంకేమీ ప్రశ్నలు అడగకూడదని కోరుకున్నాను.

“కానీ మార్కస్, నీకు ఎప్పుడూ పైన ఎక్కువ ఉండి పక్కలకి తగ్గుతూ ఉండేలా వేస్తాను కదా,” అంటూ టెలిఫోన్ తీసుకున్నాడు. “ఎందుకైనా మంచిది, మీ అమ్మకి ఫోను చేసి అడుగుతాను.”

“వద్దు!” నేను చెప్పాను. “అమ్మ ఇప్పుడు నిద్రపోతూ ఉంటుంది. నాన్న నన్ను ఇక్కడ దింపి వెళ్లాడు. నాకు కావలసినట్టు జుట్టు కత్తిరించుకోమని చెప్పాడు.”

దాంతో దోర్ మామ ఫోన్ చెయ్యకుండానే పెట్టేశాడు. “సరే, మార్కస్. ఇందుకు తరవాత నేను ఇబ్బందుల్లో పడకుండా ఉంటే చాలు.”

నేను ఏమీ మాట్లాడకుండా కూర్చున్నాను. దోర్ మామ చేతిలో ట్రిమ్మర్ బర్రమంటోంది. అమ్మకి ఈ జుట్టు ఉపయోగపడుతుంది! ఆమె ఫొటోలో ఉంటుంది, ఆమె ఆరోగ్యం కూడా బాగుపడుతుంది!



జుట్టు కత్తిరించిన తరవాత, ''అయిపోయింది,'' అంటూ దోర్ మామ నా ముఖాన్ని అద్దంలో చూపించాడు. నా కళ్లను నేనే నమ్మలేకపోయాను. నేను నా లాగా లేను – అచ్చం అమ్మ లాగా ఉన్నాను. అద్దంలోకి అలా చాలాసేపు తేరిపార చూస్తూ కూర్చున్నట్టున్నాను. ఎందుకంటే కిందకి చూసేసరికి గచ్చు శుభ్రంగా ఉంది!

''నా జుట్టు ఏది?'' కంగారుపడుతూ అడిగాను. ''నాకు ఆ జుట్టు కావాలి!''

దోర్ మామ నవ్వాడు. ''జుట్టు వద్దనే కదా కత్తిరించుకున్నావు. నేల మీద ఉన్న అందరి జుట్టు తోపాటు దానిని ఊడ్చేసి చెత్తబుట్టలో పడేశాను.''

దాంతో నేను పెద్ద పెట్టున ఏడ్వసాగాను. నేను అనుకున్నట్టు జరగలేదు. నా తల గుండు అయినప్పటికీ నా చేతికి ఒక్క వెంట్రుక కూడా రాలేదు. నాన్న వచ్చేవరకు నేను అలా ఎడుస్తూనే ఉన్నాను.

''ఏమయ్యింది, మార్కస్?'' నాన్న అడిగాడు.

నా ఏడ్పు ఆగకపోవటంతో నేను సమాధానం ఇవ్వలేకపోయాను. దోర్ మామ జరిగింది వివరించటానికి ప్రయత్నించాడు. నాన్న నన్ను హత్తుకుని, ''ఏమయ్యింది, కొడుకా?'' అని మళ్లీ అడిగాడు.

''జుట్టు,'' ఎలాగో మాట పెగిలింది. ''అమ్మకి జుట్టు కావాలి. అమ్మకి జుట్టు ఇద్దామని నేను నా జుట్టు గొరిగించుకున్నాను.'' మాటల మధ్య ఇంకా ఎక్కిళ్లు వస్తూనే ఉన్నాయి. ''కానీ దోర్ మామ నా జుట్టు పారేశాడు.'' దోర్ మామకి బై చెప్పి నాన్న నన్ను ఇంటికి తీసుకుని వెళ్లాడు.





అమ్మ మా కోసం చూస్తూ వరండాలో కూర్చుని ఉంది. నాన్న నా చెయ్యి పట్టుకుని అమ్మ దగ్గరకు తీసుకుని వెళ్లి, "ఇవ్వాళ ఏం చెయ్యాలనుకున్నావో అమ్మకి చెప్పు," అన్నాడు.

ఎలాగో మాటలు పెగిలించుకుని అంతా చెప్పాను. ఆమె ఒక్క మాట కూడా మాట్లాడకుండా పెదాలు బిగపట్టుకుని ఉంది. ఏ క్షణమైనా ఏడ్వవచ్చు అన్నట్టు ఆమె కళ్లు నిండు కుండల్లా ఉన్నాయి.

"నన్ను మన్నించు అమ్మా, నీ జుట్టు పోగొట్టాను."

"నువ్వు ఏమీ పోగొట్టలేదు," నా ముఖాన్ని చేతుల్లోకి తీసుకుని అమ్మ నన్ను ముద్దుపెట్టుకుంది. "నువ్వు ఉంటే నాకు ఇంకా జుట్టు ఎందుకు?"

"కానీ జుట్టు లేకుండా నీ ఆరోగ్యం ఎలా బాగుపడుతుంది!" నేను అన్నాను. "నువ్వు లేకపోతే అమ్మా అని నేను ఎవరిని పిలుస్తాను?"



"మార్కస్, జుట్టు వల్ల నా ఆరోగ్యం బాగుపడుదు, దిగజారదు. జుట్టు లేకుండా ఉండటం నాకు నచ్చటం లేదు, అంతే. నేను తీసుకుంటున్న మందులు లోపల బాగా పని చేస్తున్నాయి, నేను కోలుకుంటున్నానని డాక్టరు చెప్పారు." అలా అంటూ అమ్మ నా చుట్టూ చెయ్యి వేసింది, "నేను ఎప్పుడూ నీ గుండెల్లో ఉంటాను కాబట్టి ఎప్పటికీ మీ అమ్మగా ఉంటానని మాట ఇస్తున్నాను. నా ప్రేమ నిన్ను చుట్టుకుని ఎన్నటికీ విడిపోదు."

"ఏమి జరిగినా?" నేను అడిగాను.

"ఏమి జరిగినా," అమ్మ బదులిచ్చింది.

అమ్మని గట్టిగా హత్తుకున్నాను. దాంతో నా బాధంతా తొలిగిపోయి మనసు తేలికపడింది. కొంతసేపటికి కుటుంబంలోని అందరం ఒక్కటిగా కౌగిలించుకున్నాం. ఏం జరిగినా అందరం ఒక్కటిగా ఉంటామన్న ధైర్యం నాకు చిక్కింది.



ఫొటోలు దిగటానికి బయలుదేరబోతుండగా, “ఒక్క నిమిషం ఉండండి,” అంది అమ్మ. అలా అంటూ ఆమె ఇంటిలోకి పరిగెత్తింది. మళ్లీ వస్తున్న ఆమె చేతిలో యొలాందా సూచించినట్టు తలపాగా చుట్టుకోటానికి గుడ్డ ఉంది. “పదండి, కుటుంబ ఫొటోలు దిగుదాం,” ఆమె అంది. ఆమె ముఖం నిండా నవ్వు.

ఆ రోజు క్రాఫోర్డ్ నదీ తీరంలో ఫొటోగ్రాఫర్ మిజ్ మా ఫొటోలు తీశాడు. చెట్లు కూడా మన లాగే అందమైన రంగుల్లో ఉన్నాయని అమ్మ అంది. నెల రోజులకి నా జుట్టు కొంచెం పెరిగింది.



మూడు నెలల తరవాత సంతోషం కలిగించే వార్తతో అమ్మ డాక్టరు దగ్గర నుంచి తిరిగి వచ్చింది.

"కీమోథెరపీ బాగా పని చేస్తోంది. ఆరు వారాల్లో మందులు తీసుకోవటం అయిపోతుంది. క్యాన్సర్ ప్రస్తుతానికి నయం అయిపోయింది."

"యే!" మేమంతా అరుస్తూ, గెంతుతూ ఇల్లంతా సందడి చేశాం.

కొంచెం పెరిగిన నా జుట్టుని అమ్మ సవరదీస్తూ, "అమ్మ మళ్ళీ జుట్టు పెంచుకుంటే ఎలా ఉంటుంది?" అని అడిగింది.

"చాలా బాగుంటుంది!" అమ్మకి మళ్ళీ జుట్టు వస్తే చాలా బాగుంటుంది. కానీ జుట్టు కంటే నాకు అమ్మ, అమ్మకి నేను ఉండటం అన్నింటికంటే బాగుంటుంది.

త్వరలోనే చెట్లు పూస్తాయి కాబట్టి మే నెలలో ఫొటోలు దిగటం అన్న కొత్త సాంప్రదాయాన్ని మొదలబెడుతున్నాం అని నాన్న చెప్పాడు! ఆ సందర్భానికి నేను నా జుట్టుని కొత్తరకంగా తీర్చిదిద్దుకుంటాను. జడలతో నన్ను చూసి అమ్మకి ఎలా ఉంటుందో...

